॥ శ్రీహరిః ॥

# ఈ పుస్తకం ఎందుకు అవసరం అయింది?

గర్భపాతం జీవహత్య అవునా? కాదా? అది జీవహత్య అనియే నా దృఢవిశ్వాసం – నేను నిశ్చయంగా చెప్పగలను కూడ. ఎందుచేతనంటే జీవంలేనిదే ఏ వికాసం జరగటమైనా అసంభవం. "మొదటిక్షణం నుంచి పురుషుని శుక్రాణువు స్త్రీయొక్క అండంతో కలియటం జరిగినప్పటినుంచీ ఒక నూతన ప్రాణి జీవనం ప్రారంభమవుతుం"దని ఆధునిక సైన్సుకూడ తేల్చి తెల్పింది.

ఈనాడు గర్భపాతం (ఎబోర్షన్) ప్రోత్సహించటం దీనిని ఆర్థిక – సామాజిక దృష్టితో ఉచితమైన పనిగా సమర్థించటం 'ఫ్యాషన్' అయింది. దీనిద్వారా తల్లిదండ్రులు తమ అమాయకపు శిశువుల్ని జీవహత్య చేయించకుండా ఏదో సాధారణమైన ఆపరేషన్ చేయించినట్లు హత్య చేయిస్తున్నారు. ఈ గర్భపాతమనే తరంగపు చెంపపెట్టులో నా ప్రియమిత్రులు బంధువుల కుటుంబాలు కొట్టుకుపోతూ ఉండటం – పైగా వారు అహింసావాదులుగా చెలామణి అవుతూ ఉండి గర్భపాతం చేయిస్తూ అందులకై ఒక కన్నీటి బొట్టుకూడ రాల్చవలసిన అవసరం లేదనీ అది ఉచితమైన పనే అని చెప్పటానికి ప్రయత్నించిన విషయం చూచి నా హృదయం మహావ్యథకు గురియైనది.

పశుపక్ష్యాదుల హింసనాపటానికైతే అనేక సంస్థలు ప్రయత్నిస్తున్నాయి. కాని గర్భస్థశిశువుల పెరిగిపోతున్న నిరంతర హత్యలనడ్డుకోవటానికి ఏ విశేష ప్రయత్నమూ జరగటం లేదని నేను ఆలోచించాను. ఈ నిరపరాధులయిన అమాయక జీవుల హత్యలను (వీరిలో ఎవరో ఒక మహాపురుషుడు, దేశనిర్మాతకూడ కావచ్చు కదా!) గర్భంలోనే చంపిపారేయటాన్ని అడ్డుకొనేందుకు కూడ ఏదో ఒక ప్రయత్నం చెయ్యాలి. అందువల్లనే గర్భపాతపు వాస్తవికతని సామాన్య వ్యక్తికి తెలియజేసే ఒక చిన్నపుస్తకం వెలువరించాలని నిశ్చయించాను.

నా ఈ ఆశయాన్ని నేను శ్రీగోపీనాథ్ అగ్రవాల్‌గారికి తెలిపి వారిని నా ఊహలను, వైజ్ఞానిక దృష్టికోణమూ, నైతికత, ఆరోగ్యము మొదలైనవాటి దృష్టి ఆధారంగా పుస్తకం వ్రాయుమని కోరాను. వారు సంతోషంగా నామనవిని మన్నించి వ్రాసిన పుస్తకమే ఇప్పుడు మీముందు ఉంచబడుతోంది.

ప్రియబంధువులారా! ఈ చిన్నపుస్తకం చదివి గర్భపాతంద్వారా మానవుడు తనసంతానాన్ని ఈ విధముగా క్రూరంగా హత్యచేయటం ఎంతవరకు మానవోచితమైనది? ఇలా చేసినందువల్ల అతడు జీవత్ప్రాణియొక్క హత్యాపాపం చేసిన దోషికావటంలేదా? ఈ పుస్తకాన్ని చదివి మీరే స్వయంగా ఏంచేయాలో నిర్ణయించండి!

నాభికుమార్ జైన్,
జైన్‌బుక్ – ఏజెన్సీ, న్యూఢిల్లీ.

హిందీమూలము – గోపీనాథ్ అగర్వాల్.

ఆంధ్రానువాదము – శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తి.

# ప్రతీ ఎబోర్షన్ (గర్భపాతం)లోనూ హత్య అనివార్యం

పురుషుని శుక్రాణువు (sperm) స్త్రీయొక్క అండంతో (egg) కలవటంతోనే ఒక క్రొత్త జీవుడి జీవనం ప్రారంభమవుతుందని ఆధునిక విజ్ఞానం కనిపెట్టి చెప్పింది. ఇన్విట్రోఫెర్టిలైజేషన్ (Invitro fertilization) పద్ధతిలో – (ఇది ప్రపంచపుటనేక భాగాల్లో సహస్రాధిక పర్యాయాలు మళ్లీ మళ్లీ వ్యక్తీకరింపబడింది.) నిర్వివాదంగా తేల్చిచెప్పబడిందేమిటంటే – "గర్భాధానసమయంలోనే అనేక సంవత్సరాలవరకు ప్రగతికలిగించే శక్తిగల ఒక భిన్నవ్యక్తిత్వం ఉత్పన్నమవుతుంది" అని. ఆ వ్యక్తిత్వపుటౌన్నత్యమూ, బుద్ధిస్థాయి, నడిచే (కదిలే) రీతి, రక్తజాతి (Blood Group) మొదలైనవీ అప్పుడే నిశ్చితమౌతాయి. ఈ ప్రథమక్షణంనుంచే ఒక నిశ్చిత కార్యక్రమానుసారంగా నిరంతరం కొనసాగే ఆ జీవుని వికాసయాత్ర ప్రారంభమవుతుంది. ఆ జీవుడి జీవనం తల్లిజీవనం కంటె వేరుగా ఉండి ఆ ప్రాణి తల్లికంటె భిన్నంగా తన నిరంతరప్రగతిని పొందుతూ ఉంటాడు.

జీవుడు మొదటితొమ్మిది నెలలవరకు తన తల్లిగర్భవాసంలో ఉండి ఎదుగుతాడు. తన ముందుముందు ప్రగతికి ఆ నివాసం చిన్నదవటం మొదలెట్టినప్పుడు తల్లిగర్భం నుంచి బయటికి వచ్చి మరొక పెద్దనివాసంలో లోకంలో ముందుకు సాగుతాడు. శిశువు జన్మించటం ఆ తొమ్మిది నెలల వయస్సుగల ప్రాణియొక్క నివాసస్థానపు మార్పుమాత్రమే. పుట్టటం అంటే ఆ ప్రాణి ఆయువుయొక్క ప్రథమ తిథికాదు. మరి తన తల్లిగర్భంనుంచి బయటి ప్రపంచంలోకి వచ్చిన తిథి పుట్టిన రోజు (Date of Birth). పుట్టినరోజున అయితే ఆ జీవికి తొమ్మిది మాసాలయిపోయింది. మన కుటుంబం పెద్దదయినప్పుడు మనం మన చిన్న నివాసస్థానం (ఇల్లు) విడిచిపెట్టి పెద్ద యింటిలో ఉంటూ ఉన్నట్లు శిశువు తల్లి గర్భవాసమనే చిన్న యిల్లు విడిచిపెట్టి బయటి ప్రపంచంలో ఉన్న పెద్ద యింటిలో ఉండటానికి వస్తాడు. చిన్న యింటిలో చేసినా, పెద్ద యింటిలో చేసినా హత్య హత్యే. అది ఎక్కడచేసిన హత్యైనా హత్యే.

జన్మతర్వాత ఉన్న ప్రాణియే, జన్మకు తొమ్మిది నెలలపూర్వం గర్భాధానక్షణంలోనూ ఆ జీవిత ప్రాణియే ఉంది.

ఏ జీవియైనా ప్రగతి ప్రారంభదశలో ఉన్నా చివరిదశలో ఉన్నా గర్భంలోపలి నివాసంలో ఉండనీ, బయటి నివాసంలో ఉండనీ, ఏ స్థితిలో చేసిన హత్య అయినా ఒకేరకమైన హత్యయే. గర్భపాతం (Abortion) గర్భాధానం తరువాత ఎంతతొందరగా చేయించినప్పటికీ అందులో ఒక జీవిత (బ్రతికి ఉన్న) శిశువుయొక్క హత్య అనివార్యం. తల్లికి తాను గర్భవతినని అనిపిస్తూ ఉన్నంతవరకు ఆమె గర్భంలో పెరుగుతున్న బిడ్డ గుండె కొట్టుకుంటూ ఉంటుంది. మస్తిష్కం వికసితమవుతూ ఉంటుంది. ఆ బిడ్డ తన కాళ్లుచేతులు కదపటం, ప్రతిక్రియను వ్యక్తం చేస్తూ ఉంటాడు.

తమ రక్తంతోనే తయారయి తమ దాంపత్యప్రేమకు సజీవమగు ప్రతీక అయిన శిశువును గర్భపాతంద్వారా కోయించి ముక్కలు ముక్కలు చేయించి మమకారంలేకుండా హత్య చేయించే తల్లిదండ్రులూ, బాంధవులూ, ఈ నీచకార్యానికి ప్రేరణ చేసే వాళ్లూ అయిన మనుష్యుల్ని కేవలం అపరాధులని గాని పాపులని గాని అనటం చాల తక్కువ మాట. ధర్మశాస్త్రాలు పంచేంద్రియవధని, నరకగతికి కారణమనీ గర్భహత్యచేసిన స్త్రీయొక్క కళ్ళముందు భోజనంచేయటం కూడ నిషేధమనీ చెప్పాయి.

జైనమతం ఆచారాన్ననుసరించి గర్భపాతమైనప్పటికీ ఒక పూర్ణాయుర్దాయపు వ్యక్తి మృత్యువు జరిగినట్లుగానే సూతకం పాటించే విధానముంది. * భారతదేశపు సర్వోన్నత న్యాయాలయం (సుప్రీంకోర్టు) ఒక తీర్పువినిపిస్తూ వేదాలనుదహరిస్తూ 'ఎవరి ప్రాణమైనా తీయటమనేది కేవలం అపరాధమేకాదు పాపంకూడాను' అని చెప్పింది. గొప్ప న్యాయమూర్తులు (Foetus is regarded as a 'human life' from the moment of Fertilization) గర్భాధానపు సమయంనుంచీ భ్రూణం (గర్భస్థపిండం) ఒక మానవజీవనంగా పరిగణింపబడుతుంది' అనికూడ

* హిందూస్తాన్ టైమ్స్ తా. 16-4-1994.

చెప్పారు. మహాత్మాగాంధీ మాటలు ఉటంకిస్తూ వారు – "God alone can take life because he alone gives it". జీవనాన్ని తీసికొనే శక్తి కేవలం భగవంతునికే యున్నది. ఏలనన, అతడొక్కడే జీవనము నివ్వ సమర్థుడు.

ప్రతి చిన్న, పెద్ద ప్రాణికీ జీవించే సంపూర్ణాధికారం ఉంది. ఎవరి జీవనాన్నీ నష్టపరచే అధికారం ఎవరికీలేదు. ఏ తల్లిదండ్రులకీ తమ చైతన్యవంతమైన సంతానాన్ని హత్యచేయించేందుకు మినహాయింపు (Exemption) ప్రపంచంలోని ఏ మతమూ ప్రదానం చెయ్యలేదు. కనుక భ్రూణహత్య (Abortion) వంటి క్రూరమైన, అమానుషమైన, సంపూర్ణమానవజాతికే ఒక కళంకమైనట్టి హింసాకార్యాన్ని కేవలం మనం విడిచిపెట్టటమే కాక పూర్తిగ అడ్డగించటానికి చేతనైనంతవరకు ప్రయత్నించటం కూడ మానవులమైన మనందరి ప్రథమకర్తవ్యం.

## భ్రూణం (గర్భస్థశిశువు) యొక్క వికాస–క్రమం

గర్భపాతం అంటే భ్రూణ హత్య చేయించేవారిలో ఎక్కువమంది గర్భాధానం తర్వాత మూడు నాలుగు నెలల తరువాతనే గర్భస్థశిశువులో ప్రాణసంచారం జరుగుతుందని అంతకుముందు అది కేవలం ఒక మాంసపుముద్దేననీ అందులో జీవం ఉండదనీ భ్రమలోపడిపోతున్నారు. ఇది ఒక ఆత్మ వంచన, దుష్ప్రచారము మాత్రమే. మునుపే చెప్పి ఉన్నట్లు జీవంలేనిదే వికాసం అసంభవం. గర్భాధానమప్పుడే పురుషుని శుక్రాణువు (sperm) స్త్రీ అండంతో (egg) కలుస్తూనే ఒక క్రొత్తజీవం అస్తిత్వం (ఉనికి) లోకి వచ్చేస్తుంది. ఆ క్షణంలోనే స్త్రీపురుషుల (క్రోమోజోమ్స్) గుణసూత్రాల కలయిక కాగానే ఆ క్రొత్తజీవంయొక్క వ్యక్తిత్వపుటౌన్నత్యం, బుద్ధికిచెందిన స్థాయి బ్లడ్‌గ్రూపు మొదలైనవి నిశ్చితమైపోతాయి. తల్లికడుపులో గడిపిన తొమ్మిదినెలల కాలమూ కేవలం ఆ జీవుని నిరంతర వికాస ప్రగతుల కథనం మాత్రమే.

వైజ్ఞానికులు చెప్పినదాని ప్రకారం ఈ ప్రగతి క్రింది విధముగా ఉంటుంది -

మొదటి వారం (First Week) - సెల్స్ (కణముల) యొక్క పంపకం జరుగుతూ ఉంటుంది. ఒక క్రొత్తజీవితం తల్లిగర్భంలో తన స్థానాన్ని ఏర్పాటు చేసుకుంటుంది. క్రొత్తగా పుట్టిన జీవుడు వికసితుడవటం మొదలుపెడతాడు.




రెండవ వారం (Second Week) - తల్లి తీసుకొన్న ఆహారంనుంచి క్రొత్తజీవుడు పోషణ పొందసాగుతాడు.



మూడవవారం (Third Week) - ఈ అతిసూక్ష్మ ప్రాణికి, కళ్లు, వెన్నెముక, మస్తిష్కం, స్పైనల్‌కార్డ్, నర్వస్ సిస్టం, శ్వాసనాళాలు, పొట్ట, హృదయం, ప్రేగులు, మూత్రపిండాలు మొదలైనవాటి నిర్మాణప్రక్రియ ప్రారంభమవుతుంది. పద్దెనిమిదో రోజున గుండె కొట్టుకోవటం ఆరంభమైపోతుంది.



నాలుగవ వారం (Fourth Week)- తల తయారవటం మొదలవుతుంది. వెన్నెముక పూర్తినిర్మాణం జరిగి సుషుమ్న నాడి తయారయి పూర్తయిపోతుంది. చేతులు కాళ్ళు తయారవటం మొదలవుతుంది.



ఐదవ వారం (Fifth Week) - వక్షస్థలం, పొట్ట తయారయి ఒకదానితో మరొకటి వేరయిపోతాయి. తల, కళ్ళు, కళ్ళమీది "లెన్సు" (కటకం) దృష్టిపటలం (Retina) వచ్చేస్తాయి. చెవులేర్పడతాయి. చేతుల, కాళ్ల వ్రేళ్లేర్పడతాయి.



ఆరవ, ఏడవ వారాలు (Sixth & Seventh Week) - బిడ్డ

శరీరపు సర్వాంగాలు, శిరస్సు, ఆకారం, ముఖం, నాలుక మొదలైనవి ఏర్పడి తయారైపోతాయి. మస్తిష్కం (మెదడు) పూర్తిగా వికసిస్తుంది. మస్తిష్కపు తరంగములను (waves) కొలవవచ్చు. బిడ్డయొక్క లింగపు జాడ తెలుస్తుంది. బిడ్డ తన అవయవాలు, చేతులు, కాళ్లు కదపగలుగు (తాడు) తుంది. చక్కిలిగిలి పెట్టటంతో బిడ్డలో ప్రతిక్రియ కనిపిస్తుంది.



ఎనిమిదవ వారం (Eighth Week) - బిడ్డకి స్పర్శ, నొప్పి వీటి అనుభవం కలగటం మొదలవుతుంది. పిడికిలి ముడవ గలుగుతాడు. ఏదైనా పట్టుకోగలుగుతాడు. బొటనవ్రేలు చీకగలుగుతాడు. ఈత ఈదే ముద్ర (పద్ధతి)లో కదులుతాడు. నిద్రపోవటం, మేలుకోవటం, చేయసాగుతాడు. ఏ వస్తువైనా తాకినప్పుడు దానినుంచి తనను రక్షించుకొనే ప్రయత్నం చేస్తాడు. అతని హృదయస్పందన (గుండెకొట్టుకోవటం) అల్ట్రాసోనిక్ స్టెథోస్కోపుద్వారా వినవచ్చు. అతని బొటనవ్రేలిముద్ర అతని యెనభైయేళ్ల వయస్సులో ఎట్లుంటుందో ఆ విధంగానే ఉంటుంది.




1. Electrical impulses from his brain detected.
2. Baby can clutch things with his hands.
3. Baby's finger print.

పదకొండు, పన్నెండువారాలు (Eleventh & Twelfth week)- శరీరపు సర్వావయవ ప్రణాళిక (Organ system) తయారైపోతుంది. పని చేయటం కూడ ఆరంభమవుతుంది. నరాల (స్నాయువు) కండల సామంజస్యం (సరిగా ఏర్పడటం) స్థాపింపబడుతుంది. వ్రేళ్లకి గోళ్లు మొలవటం జరుగుతుంది. ఇప్పుడా బిడ్డ కేవలం పెరగటమే కావలసింది.




1. All systems are good.
2. Time for me to get growing now.
3. The child can feel pain.

పదహారవ వారం (Sixteenth Week) - తల్లికి బిడ్డ కదులుతూ మెదలుతూ ఉండటం తెలుస్తుంది. ఇప్పుడు బిడ్డపొడవు 5.5 అంగుళాలుంటుంది. తల్లిపొట్టమీద స్టెథోస్కోపుపెట్టి గర్భస్థశిశువుయొక్క హృదయస్పందన వినవచ్చును.

ఆరవనెలలో బిడ్డ - 11-12", ఏడవనెలలో 14", ఎనిమిదవ నెలలో 15-16", తొమ్మిదవనెల చివరకి 17-18" పొడుగవుతుంది. దాని బరువు 6-7 పౌన్లు అవుతుంది. డా॥ థామస్ బర్నీ తన "ద సీక్రెట్ లైఫ్ ఆఫ్ అన్‌బోర్న్ చైల్డ్" అనే పుస్తకంలో వ్రాసినాడు - ఐదవనెలమధ్యలో తల్లి ఉదరం (Abdoman) మీద తళతళమెరిసే కాంతి కలిగినప్పుడు బిడ్డ తన చేతులు కదిపి కళ్లు మూసుకొనే స్థితికి ఎదుగుతుంది. తేజము సంగీతము అతనిని తన చేతులను చెవులవైపు తీసుకొనివెడతాయి. (వెలుతురు - గానం గమనించే స్థితి కలుగుతుందన్నమాట) కళ్లు చురుగ్గా తిరగటం (ఇటూ అటూ) ద్వారా అతనికి నిద్ర మెలకువ స్వప్నావస్థల జాడ

తెలుస్తుంది.

ఫిబ్రవరి, 1991 నాటి "గృహశోభ" పత్రికలో వచ్చిన సమాచారాన్ననుసరించి బ్రిటిష్ మనోవైజ్ఞానిక పరిషత్తుకు చెందిన శ్రీ పీటర్ హాపర్ కొన్ని సంవత్సరాల అధ్యయనం తర్వాత "పన్నెండు వారాల భ్రూణంకూడ సంగీతాన్ని గుర్తించగలుగుతుం"దని నిర్ధారణకు వచ్చాడు. అది కేవలం గర్భంలో సంగీత ధ్వనులమీద ప్రతిక్రియ వ్యక్తం చేయటమేకాక వేరు వేరు ధ్వనులను గుర్తించటంకూడ నేర్చుకుంటుంది. ఆయనంటాడు - పుట్టిన బిడ్డకు తనకు పరిచితమైన ధ్వని (పాట) వినిపిస్తే అది ఏడుస్తున్నదల్లా ఊరకుండిపోతుంది. అప్పుడు పుట్టిన బిడ్డ కేవలం తాను తన తల్లి గర్భంలో ఉండగా విన్న ధ్వనుల్నే గుర్తించగలుగుతుంది. ఈ నిష్కర్ష మహాభారతంలో అభిమన్యుడు గర్భంలోనే పద్మవ్యూహం భేదించే శిక్షణ పొందిన సంఘటన యొక్క యాథార్థ్యాన్ని ఆమోదిస్తోంది.

ఈ విధముగానే Shechenov Institute of Evolutionary Physiology & Biochemistry of Russia కు చెందిన శిశుమనోవిజ్ఞాన శాస్త్రజ్ఞుల నిష్కర్షకూడ ఉంది - ప్రకృతి బిడ్డని గర్భావస్థలోని ఆరవ నెలలోనే సమస్తమూ తెలుసుకోవటానికి తగినదానినిగా తయారుచేస్తుంది. అది అంతా (అన్నీ) వినటం చూడటం మొదలుపెడుతుంది. వాసన చూడటం, రుచి చూడటం అనుభవంలోకి తెచ్చుకుంటుంది.

* మహాభారతంలో ఉన్న అభిమన్యుని ఘట్టం ఇంకా చాల దేశాల్లో జరిగిన పరిశోధనల నిష్కర్షలవల్ల ప్రోత్సహింపబడి ఒరిస్సా ప్రభుత్వం గర్భవతులైన తల్లులకు తమ గర్భస్థశిశువులకు గర్భంలోనే శిక్షణయిచ్చే (విద్యనేర్పే) కార్యక్రమం ప్రారంభించబోతోంది. ఈ కార్యక్రమం National Institute of Habital Management, భువనేశ్వర్ ద్వారా ప్రారంభించబడుతోంది. ఈ కార్యక్రమంలో భాగంగా గర్భవతులైన

---

* టైమ్స్ ఆఫ్ ఇండియా తా. 4-7-1994

మాతలకు నాలుగైదు నెలలలో శిక్షణ ఇస్తారు. ఎందుచేతనంటే - Dr. S. N. Pati చెప్పినదాని ప్రకారం ఈ సమయంలో భ్రూణంయొక్క మస్తిష్కం "Psychosomatic Reaction" ద్వారా తల్లీబిడ్డల మధ్య రక్త సంచాలనంవల్లనే గర్భస్థశిశువు తల్లిద్వారా విభిన్నసంకేతాలు పొందగలిగినంత వికసితమయి ఉంటుంది. ఇటువంటి శిక్షణ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములో కూడా సేవాసదన్, హైదరాబాదు, అను స్వచ్ఛందసంస్థ గర్భస్థశిశువులకు ఉచిత శిక్షణ వారి తల్లులద్వారా యిచ్చుచున్నది. ఈ శిక్షణవలన తల్లి, పిల్లలకు శారీరిక, మానసిక స్వస్థతలు కలుగుచున్నట్లు అనుభవపూర్వకముగా తెలియుచున్నది.

మామూలు మాటలలో దీనినిలా చెప్పవచ్చు - "తల్లీ గర్భస్థశిశువుల మస్తిష్కాలలో ఒక సామంజస్యం ఏర్పడుతుంది. అంటే తల్లితలలో (మెదడు = మనస్సు) కలిగే ఊహాలే అప్పుడే గర్భస్థశిశువు మెదడుమీద కూడ తమ ముద్రవేసుకుంటాయి. ఉదాహరణకు ఒక కారుగాని స్కూటర్‌గాని నడిపే గర్భవతియైన మాత తెలియకుండానే తన గర్భస్థశిశువుకి సురక్షితంగా వాహనం నడిపే విజ్ఞానం నేర్పిస్తుంది.

ఒక డాక్టరు సంతానం డాక్టరుగాను, సంగీతజ్ఞుని సంతతి సంగీతం తెలిసినదిగాను, క్రికెటర్ సంతానం క్రికెటర్‌గానే తయారవుతూ ఉండటం తరుచు కనబడుతూ ఉంటుంది. ఇందుకు కారణం సంతానం గర్భావస్థలోనే తమ తల్లిదండ్రులద్వారా వారిజ్ఞానంతో అభిరుచులతో శిక్షణ పొందుతూ ఉండటమే. సమయం వచ్చినప్పుడు వారు గర్భావస్థలో పొందిన జ్ఞానమే ఆ విషయంలో నేర్పు పొందేందుకు సహకరిస్తుంది. శాస్త్రాలలో దీనినే తల్లిదండ్రులవల్ల సంక్రమించిన సంస్కారమంటారు.

Williams obstetrics (17th Edition 1985) అనే గ్రంథ రచయిత, "Happily, we live and work in an era in which the foetus is established as our second patient, with many rights and privileges comparable to those previously achieved only after birth" అన్నాడు. అంటే విజ్ఞాన

ప్రగతితోబాటు భ్రూణాన్ని ఇప్పుడు తల్లితో వేరే ఒక (మరొక) రోగిగా పరిగణిస్తున్నాం. గర్భస్థశిశువుకు వచ్చిన కొన్ని రోగాలకు కొన్నిరకాల ఆపరేషన్లు కూడ చేస్తున్నారు.

బాలహృదయరోగాల నిపుణురాలు (స్పెషలిష్టు) శ్రీమతి డా ॥ ఓనల్ ఖలీలుల్లాహ చెప్పినదాని ప్రకారం గర్భావస్థలో తల్లికి ఎక్స్‌రే తీయిస్తే మొదటి మూడు నెలలవరకు వికిరణప్రభావం గర్భంలో పెరుగుతున్న శిశువు మీదకూడ పడగలదు. ఆమె (డాక్టర్) సాధ్యమైనంతవరకు డాక్టరు సలహాలేనిదే ఏరకమైన మందువాడటాన్నైనా సరే నిషేధించింది.

విశ్వప్రసిద్ధ పత్రిక 'Lancet' గర్భవతులైన మహిళలను 'అల్ట్రాసౌండ్' నుంచి కూడ జాగ్రత్తగా ఉండమని హెచ్చరించింది. గర్భవతి మాటిమాటికి అల్ట్రాసౌండ్ పరీక్షచేయించటంవల్ల భ్రూణంయొక్క వికాసం ప్రభావితమవుతుంది. గర్భావస్థ సందర్భంలో ఐదుసార్లు అల్ట్రాసౌండు చేయించుకొన్న మహిళలు కేవలం ఒక్కసారి అల్ట్రాసౌండ్ చేయించుకొన్న మహిళతో పోలిస్తే ఇరువది అయిదు గ్రాముల తక్కువ బరువున్న శిశువులనుకన్నారు.

~~~~oOo~~~~

జనసత్తా, తా. 19-12-93
దేహలీ మిడ్ డే, తా. 17-12-93
~~~~

# (ఎబోర్షన్) క్రమబద్ధ భ్రూణ హత్యయొక్క విధులు

ఎబోర్షన్ అంటే గర్భపాతం చేయించుకోవటాన్ని ఎక్కువమంది వ్యక్తులు ఒక సాధారణ శల్యక్రియ అనుకొంటున్నారు - శరీరంలో ఏర్పడిన ఏదో రాయిని తీసెయ్యటమే అని. ఈ ఊహ కేవలం పొరపాటు. ఎబోర్షన్ మాత్రం ఒక చైతన్యవంతమైన నిర్దోషప్రాణియొక్క ప్రణాళికాబద్ధమైన క్రూరహత్య. గర్భంలో జీవియొక్క అస్తిత్వం అయితే గర్భాధానక్షణంనుంచే ఏర్పడుతుంది. తల్లికి తాను గర్భవతిననే విషయం తెలిసేసరికే ఆమె గర్భంలో ఉన్న శిశువుకు సర్వావయవాలూ ఏర్పడిపోయి ఉంటాయి. మనోవికాసం గూడ ఏర్పడిపోయే ఉంటుంది. గుండెకొట్టుకోవటం మొదలయ్యే ఉంటుంది. అంటే అది ఒక సంపూర్ణ ప్రాణి అయ్యే ఉంటుంది.

ఇటువంటి తమ జీవచ్ఛిశువుని ఎబోర్షన్ ద్వారా హత్యచేయించ నిశ్చయించుకొనే తల్లిదండ్రులు, ఈ ప్రక్రియద్వారా జీవంతో ఉన్న నిస్సంశయంగా పూర్ణవికాసం పొందిన తమ సంతానాన్ని ఎటువంటి నిర్దయతో మమకారం లేకుండా యాతన పెట్టిపెట్టి హత్యచేస్తున్నారో తెలుసుకొంటే తమ గర్భస్థశిశువుయొక్క హత్య అంటే ఎబోర్షన్ మళ్లీ ఎప్పుడూ చేయించుకొనేందుకు సిద్ధపడరనేమాట నిశ్చయం.

## * ఎబోర్షన్ యొక్క ముఖ్యవిధానాలు

1. (Suction Aspiration) చూషణ పద్ధతి - ఇది అన్నిటికంటె ఎక్కువ ప్రచారంలో ఉన్న పద్ధతి. ఇందులో గర్భాశయం (womb) యొక్క ముఖం తెరచి దానిలోపల (Suction curette) చాకువంటి కొనగల ఒక బోలుగా ఉన్న నాళిక, (నాళికతోపాటు ఒక పంపు అతుక్కొని ఉంటుంది) ప్రవేశపెడతారు. పంపుని బాగా (తీక్షణంగా=బలంగా) నొక్కటం లాగటం ద్వారా బిడ్డశరీరాన్ని చీల్చి ముక్కలు ముక్కలు చేయటం జరుగుతుంది.

---

* బచావో! బచావో! రచయిత, ముని రశ్మిరత్నవిజయ.

దీని చాకు దెబ్బ పరిధిలోకి వచ్చిన బిడ్డయొక్క (ఒకప్పుడొకటిగా మరొకప్పుడింకొకటిగా) వక్షస్థలం, పొట్ట, తల మొదలైన అవయవములు నరుక్కుపోతుంది. నరకబడి పగులగొట్టబడిన ఈ మాంసపుముక్కల్ని ఏదో చెత్తచెదారాన్ని బయటికి లాగినట్టు లాగిపారేస్తారు.



2. (Dilation and Evacuation) - వ్యాపన తొలగింపు పద్ధతి. ఈ పద్ధతి మూడునుంచి తొమ్మిదినెలలవరకు వయస్సున్న శిశువులకోసం ప్రయోగంలోకి తేబడుతుంది. ఇందులో గర్భాశయం (Womb) యొక్క ముఖం (ద్వారం) లాగి బాగా తెరవబడుతుంది. ఒక ప్రత్యేకమైన పనిముట్టుతో బిడ్డశరీరాన్ని కోసి దాని కపాలం త్రుంచేస్తారు. బిడ్డయొక్క అవయవాల నరికిన - నలగ్గొట్టిన ముక్కల్ని గుండ్రని ఉంగరాలకత్తెరతో తొలగిస్తారు. బిడ్డయొక్క ముక్కలు ముక్కలై నలిగిపోయిన తల, నెత్తురుతో నిండిన ప్రేగులు కొట్టుకుంటూ ఉన్నట్టున్న (స్పందనగల) చిన్న హృదయం (గుండె) అన్నీ చెత్తాచెదారపుకుప్పని పారేసినట్టు విసిరిపారేస్తారు.



3. Dilatation and Curettage (D and C) పద్ధతి -ఇదికూడ మొదటిపద్ధతి లాగే ఉంటుంది. ఈ పద్ధతిలో చాకు ఒక మంచి పదునైన లూప్ ఆకారంలో ఉంటుంది. అది గర్భాశయంలో బిడ్డని కోసిపారేస్తుంది.

తెగిపోయిన అవయవాల ముక్కల్ని ఒక చమ్చావంటి సాధనంతో (Cervix) గర్భాశయముఖం (ద్వారం) నుంచి తొలగిస్తారు.



4. విషక్షార పద్ధతి - ఒక పొడవై లావుగా ఉన్న సూది గర్భాశయంలోకి తగిలించి దానిలో పిచకారీ సహాయంతో ఉప్పుయొక్క క్షారద్రవం విడచిపెడతారు. క్షారంయొక్క కొంచెం అంశాన్ని నాలుగువైపులనుంచీ చుట్టబడిన బిడ్డ మ్రింగేస్తాడు. విషం త్రాగిన వ్యక్తిలాగ గిలగిల కొట్టుకోవటం మొదలెడతాడు. అతడి చర్మం నల్లబడిపోతుంది. ఊపిరాడక అక్కడే చచ్చిపోతాడు. ఇంక అతణ్ణి (ఆ బిడ్డని) బైటికి లాగేస్తారు.

~~~~oOo~~~~

## గర్భపాతం చేయించటంలో తల్లికికూడ అపాయాలు

గర్భపాతం (ఎబోర్షన్) లేదా భ్రూణహత్యవల్ల ఒకప్రక్క నిరపరాధియైన గర్భస్థశిశువుయొక్క మమకారరహిత హత్య జరిగేచోటే మరోప్రక్క గర్భపాతం చేయించుకొనే తల్లికికూడ అనేక జటిల సమస్యలయొక్క సంకటము కొద్దోగొప్పో కలిగే తీరుతుంది. వీటిలో కొన్ని ఊహించిన జటిలతలు తాత్కాలిక ప్రభావంకలవీ కొన్ని దీర్ఘకాలిక ప్రభావం కలవీ సంభవిస్తాయి. అవి తల్లిని కేవలం భవిష్యత్తులో వంధ్యని (గొడ్రాలిని) చేయగలగటమేకాక ఆమె ప్రాణానికికూడ అపాయం కల్గిస్తాయి.
~~~~

## * తాత్కాలిక జటిలతలు

1. (Haemorrhage) హీమరేజ్ - (రక్తస్రావం) గర్భపాతం జరుగుతూ ఉండగా రక్తహాని కావటంవల్ల తల్లికి దీనివల్ల అపాయం కలుగవచ్చు - రక్తం ఎక్కించే అవసరం కలుగవచ్చు.

2. (Infection) రోగసంక్రమణం - గర్భపాతం సందర్భంగా గర్భస్థశిశువుయొక్క తెగిపోయిన ఏదైనా అవయవంగాని, భాగంగాని గర్భాశయంలో మిగిలిపోవటంవలన లేదా ఆపరేషన్ సమయంలో ఏదైనా ఇతరలోపం జరిగిన పరిస్థితిలోనూ "ట్యూబల్ ఇన్ఫెక్షన్" రావచ్చు. గర్భాశయ నాళానికి రోగం సంక్రమింపవచ్చు. తర్వాత ఆమె గొడ్రాలు కూడ కావచ్చు.

3. (Damaged Cervix) - గర్భాశయంయొక్క క్షతి గర్భపాతం సందర్భంగా దానికి చెందిన పనిముట్లు (చాకు, కత్తెర మొదలైన) ప్రయోగించటానికి గర్భాశయ ద్వారం తెరవవలసి రావటంవల్ల దానికి ఆఘాతం తగిలి భవిష్యత్తులో దానంతట అదే గర్భపాతం అవటం గాని, ప్రసవం కావలసిన సమయానికిముందే శిశువును కనే పరిస్థితిగాని కలగవచ్చు.

4. (Perforation of the uterus) గర్భాశయంలో రంధ్రము పడటం గర్భపాతంకోసం ప్రయోగించే పనిముట్టు (Curette) వల్ల బిడ్డసంచికి రంధ్రము పడవచ్చు. ఫలితంగా దానిని తొలగించవలసి కూడ రావచ్చు. స్త్రీ తర్వాత వంధ్య (గొడ్రాలు) కావచ్చు.

5. (Perforation of the Bowl) - ప్రేగులలో రంధ్రము పడటం గర్భపాతంకోసం ఉపయోగించే పనిముట్లవల్ల ప్రేగులో రంధ్రము పడవచ్చు.

---

* Article - Sahu Shalendra Kumar Jain, Advocate.

## * దీర్ఘకాలిక జటిలతలు

1. (Stillborn and Handicapped babies) మృత లేక వికలాంగ శిశువులు - రక్తం RH negative ఉన్న స్త్రీలకు, గర్భపాతం తర్వాత RHO-gam లభించని స్త్రీలకు కలిగే భావి సంతానానికిటువంటి అపాయం సంభవిస్తుంది.

2. (Miscarriages) గర్భస్రావం - గర్భపాతం చేయించుకొని ఉన్న స్త్రీలకు గర్భస్రావంయొక్క అపాయం 35% మేరకు అధికమవుతుంది.

3. (Impaired Child - bearing ability) వికృతగర్భక్షమత- గర్భపాతం జరిగాక రాబోయే సంతానం ఉత్పత్తిలో పుట్టేటప్పుడు కష్టమవుతుంది.

4. (Premature Births) నెలలునిండకపూర్వమే ప్రసవం కలగటం - అధికగర్భపాతం చేయించుకోవటంవల్ల సమయానికి ముందే బిడ్డపుట్టే అపాయం 2 నుంచి 3.3 రెట్లు పెరుగుతుంది.

5. (Low Birth Weight) తక్కువ బరువుగల బిడ్డ పుట్టటం- గర్భపాతం తరువాత కలిగే ఆగామిసంతానం తక్కువ బరువు కలది అయ్యే అపాయం 2 నుంచి 2.25 రెట్లు పెరుగుతుంది.

6. (Ectopic Pregnancies) బిడ్డ ఫాల్లియోపియన్ ట్యూబులో పెరగటం - ఇందులో తల్లి ప్రాణానికి చాల అపాయం ఉంది. బిడ్డ గర్భాశయంలో కాక (గర్భాశయంలో పెరగటానికి బదులు) (Falliopiantube) ఫాలిహేపియన్ ట్యూబులో పెరుగుతోంది. ఈ రకమైన ఘటనలు బాగా ఎక్కువైనవి. ఇందులో తాత్కాలికమైన ఆపరేషన్ చేయించవలసి వస్తోంది.

గర్భపాతం చేయించాక కలిగే నష్టాల విషయంలో జరిగిన సర్వేలో వైజ్ఞానికుల అభిప్రాయాలు - శాకాహార క్రాంతి - నవంబర్, డిసెంబర్ 1989లో ముద్రితమైన వ్యాసం ప్రకారం - స్త్రీలు గర్భహత్య అయితే చేయించేసుకొంటున్నారు. కాని జీవితమంతా బాధపడుతున్నారు. శరీరం

* Article - Sahu Shalendra Kumar Jain, Advocate.

రోగాల ప్రదర్శనశాలగా తయారవుతోంది. ఇల్లు కలహాల, క్లేశాల రణస్థలంగా తయారవుతోంది. కుటుంబమంతా అశాంతి, దుఃఖాల భీషణ జ్వాలలలో కుమిలిపోతూ ఉంటోంది.

* గర్భపాతం చేయించుకొనే బాలికలలో మూడవవంతుమంది మళ్ళీ వాళ్లెప్పుడూ సంతానాన్ని కనలేనటువంటి రోగాలకు బలైపోతున్నారు (టోరంటో కెనడాయొక్క 1970వ పరిశోధనల ప్రకారం).

* ప్రసవకాలంలో కలిగే అపాయంకంటె రెట్టింపు అపాయం గర్భపాతంలో కలుగుతుంది.

* జపాన్‌కు చెందిన (Nagode Survey, 1968) సర్వే ప్రకారం గర్భపాతం చేయించుకొనే మహిళలలో 30% కంటె ఎక్కువమందికి తర్వాత మానసిక కాఠిన్యాల ఫిర్యాదులు వస్తున్నాయి (మానసిక వ్యాధులబారినపడినట్లు చెపుతున్నారు).

జులై 15, 1990న హిందూస్తాన్ టైమ్స్‌లో వచ్చిన వ్యాసాన్ని (Abortion related deaths increasing) అనుసరించి ప్రపంచంలో (ప్రతి) యేటా జరిగే ఐదుకోట్ల గర్భపాతాల్లో దాదాపు సగం చట్టవిరుద్ధంగా జరుగుతున్నాయి. వాటిలో దాదాపు రెండులక్షలమంది స్త్రీలు ప్రతిసంవత్సరం చనిపోతున్నారు. దాదాపు అరువది నుంచి ఎనుబది లక్షలమంది జీవితాంతం రోగాల బారిన పడుతున్నారు. భారతదేశం (హిందూస్తాన్)లోనే సుమారు ఐదు లక్షలమంది స్త్రీలు యేటా చట్టబద్ధంకాని గర్భపాతాల ద్వారా కలిగే సమస్యలవల్ల మరణిస్తున్నారు. కనుక గర్భపాతం చేయించటంలో తల్లికికూడ అపాయాలు తక్కువేమీ కాదు.

~~~oOo~~~

* "గర్భపాతం మాతృత్వంయొక్క హత్య", రచయిత ముని శ్రీజితరత్నసాగర్‌జీ 'రాజహంస'
~~~

# * గర్భస్థశిశువుయొక్క హత్య కళ్ళారా చూచినవైనం

1984వ సం॥లో "నేషనల్ రైట్స్ టు లైఫ్ కన్వెన్షన్" కనాప్ సిటీ, మిస్సోరీలో జరిగింది. ఇదే (కన్వెన్షన్) సమ్మేళనయొక్క ఒక ప్రతినిధి Mrs. Sandy Ressal. Dr. Bernard Nathanson నిర్మించిన (Suction Abortion) గర్భపాతపు అల్ట్రాసౌండ్ మూవీయొక్క వివరణ ఇచ్చారు. అది ఆయన మాటల్లోనే ఈ విధముగా ఉంది.

గర్భంలోని ఆ (ఏ పాపం ఎరుగని) అమాయకపు బిడ్డకి ఇప్పుడే పదివారాలు నిండాయి. చాల దృఢంగా ఉంది. మేము ఆ బిడ్డను తన తల్లి కడుపులో ఆడుతూ, పక్కమరలుతూ, బొటనవ్రేలు చీకుతూ ఉండటం చూస్తున్నాం. ఆ బిడ్డ హృదయస్పందనాన్ని (గుండెకొట్టుకోవటం) కూడ మేము చూడగలుగుతున్నాం. అప్పుడది నూటయిరవై సాధారణగతితో కొట్టుకుంటోంది. అంతా సామాన్యంగా ఉంది కాని (ఎప్పుడయితే) మొదట సక్షన్‌పంపు గర్భాశయపుగోడని (తాకిందో) తాకేసరికి ఆ పసిబిడ్డ భయంతో ఒక్కసారిగా తిరిగి ముడుచుకుపోయింది. దాని గుండెకొట్టుకోవటం (Heart beating) బాగా పెరిగింది. ఎందుకంటె ఇంతవరకు ఏ ఆయుధమూ ఆ బిడ్డని తాకనైనా లేదు. కాని ఏదోవస్తువు తన పటకటింటిని, తన సురక్షితక్షేత్రాన్ని ఆక్రమించటానికి ప్రయత్నిస్తున్నట్టున్న అనుభవం ఆ బిడ్డకి కలిగింది.

ఏ రకంగా ఆ పనిముట్టు ఆ బుల్లి బొమ్మలాంటి పసి బిడ్డని ముక్కలు ముక్కలుచేస్తోందో మేము భయకంపితులమై చూస్తూ ఉన్నాం. మొదట నడుము (Spine) తర్వాత కాళ్లు ఇత్యాదిగా - అది ఒక జీవం ఉన్న ప్రాణిగాకాక ఏదో దుంపగా భావించి ముక్కలుగా నరుకబడుతున్నాయి. ఆ బిడ్డ గిలగిలా కొట్టుకుంటూ ముడుచుకు ముడుచుకుపోతూ తిరిగితిరిగి అరుస్తూ (ధ్వని) ఆ ఆయుధం నుంచి

* Article - Sahu Shalendra kumar Jain, Advocate.

తప్పించుకునే ప్రయత్నంచేస్తూ ఉంది. ఒకసారి దాని గుండె కొట్టుకోవటం రెండువందల దాక చేరింది. అది అంతగా భయపడి పోయింది. అది తన తలవెనక్కి లాగుకోవటం నోరుతెరచి అరవటానికి ప్రయత్నించటం దానిని డా॥ నైథాన్‌సన్ సైలెంట్ స్క్రీమ్ (Silent Scream) మూగ అరుపు లేదా మూగపిలుపు అని బాగానే అన్నాడు. నేను నాకళ్లతో స్వయంగా చూచాను. చివరకి మేము పటకారుతో (Forceps) దాని కపాలాన్ని త్రుంచటానికి అన్వేషిస్తున్నప్పటి క్రూరబీభత్సదృశ్యాన్నికూడా చూచాము. మళ్లీ నొక్కి ఆ కఠోరకపాలాన్ని త్రుంచుతోంది. ఎందుకంటే శిరస్సుయొక్క ఆ భాగాన్ని త్రుంచందే సక్షన్‌ట్యూబ్ (Suction tube) చూషనాళం ద్వారా బయటికి తీసుకురాలేం.

హత్యయొక్క ఈ బీభత్సక్రీడ నిర్వహించటానికి దాదాపు పదిహేను నిముషములు పట్టింది. ఈ బాధాకర దృశ్యాన్నంతకంటె ఎక్కువగా ఎలా అంచనావేయ (ఊహించ) గలం. ఈ గర్భపాతం (ఎబోర్షన్) చేసి కుతూహలంతో దీని ఫిల్మ్ తయారు చేయించిన డాక్టరు తాను ఈ ఫిల్ముచూపి తన క్లినిక్ విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. మళ్లీరాలేదు.

* గర్భస్థశిశుహత్యనీ, దాని వేదననీ చూపించే ఈ ఫిల్మును (Silent Scream) మాజీ అమెరికా ప్రెసిడెంట్ శ్రీ రోనాల్డ్ రీగన్ చూచి దీనివల్ల ప్రభావితుడై అమెరికా సంసద్‌యొక్క ప్రతిసదస్యుణ్ణి ఈ ఫిలిం చూడమని పట్టుబట్టాడు. శ్రీరీగన్ ఎబోర్షన్ చట్టాన్ని మార్చాలని కాంక్షించాడు.

* మదర్ థెరిస్సా, "గర్భపాతం గర్భాశయంలోని బిడ్డని హత్యచేయటమే" అన్నది. ఆమె ప్రపంచ దేశప్రభుత్వాలను గర్భపాతపు చట్టాన్ని రద్దుపరచమని పట్టుబట్టింది (Demand చేసింది.).

---

* Article - Sahu Shalendra kumar Jain, Advocate.
* "రక్షించు! రక్షించు "
  రచయిత ముని రశ్మిరత్న విజయ్.

Stonaway, New Delhi, 12-2-1994లో ముద్రింపబడ్డ సమాచారం ప్రకారం మదర్ థెరిస్సా అమెరికాలో పెరుగుతున్న హింసాకాండయొక్క సంబంధం భ్రూణహత్యతో జోడించింది. ఆమె అమెరికా రాష్ట్రపతి క్లింటన్, ఉపరాష్ట్రపతి గోరే, వారిపత్నులు, మూడువేలమంది ఇతర శ్రోతల సమక్షంలో తన ఉపన్యాసంలో, "If we accept that a mother can kill even her own child, how can we tell other people not to kill each other? Any country that accepts abortion if not teaching its people to love, but to use any violence to get what they want". ఒక తల్లి తన బిడ్డని హత్యచేయవచ్చునని మనం అంగీకరిస్తే ఇతరులతో మీలో మీరు హత్యలు చేసుకోవద్దు? అని ఎలా చెప్పగలం? గర్భపాతాన్ని గౌరవించిన (చట్టబద్ధంచేసిన) ఏ దేశమైనా తన ప్రజలకు ప్రేమవిద్య గరపకుండా వారు తమ కోరిక నెరవేర్చుకోవటానికి హింసను చేపట్టవచ్చుననే శిక్షణ ఇస్తోందన్నమాట.

ఒక్క అమెరికాలోనే ప్రతియేటా పదిహేను లక్షలదాకా 'ఎబోర్షన్లు' అవుతున్నాయి.

హిందుస్తాన్ టైమ్స్, తా. 2-9-1994లో వచ్చిన సమాచారాన్ననుసరించి మదర్ థెరిస్సా కాహిరాలో జరిగే World Population Conference కు పూర్వసంధ్యలో, "The greatest destroyer of peace today in the world is abortion. The only one who has the right to take life is the one who has created it. Nobody else has the right — not the mother, not the father, not the doctor, no agencies, no conference, no Government" గర్భపాతం నేడు ప్రపంచశాంతిని నష్టపరచే అన్నిటికంటె పెద్ద కారణం. జీవనాన్ని ఇచ్చిన ప్రభువునకొక్కడికే జీవనం తీసుకొనే అధికారముంది. ఆయన తప్ప ఎవరికీ తల్లికీ, తండ్రికీ, డాక్టరుకూ, మరే సంస్థకీ, సమ్మేళనానికీ ప్రభుత్వానికి గాని గర్భపాతం ద్వారా జీవనం (ప్రాణం) తీసే అధికారం లేనేలేదు.

సంధ్యాటైమ్స్, తా. 6-9-1994లో వచ్చిన సమాచారం (వార్త) కాహిరాలో జరిగిన పైనచెప్పిన విశ్వసమ్మేళనం (World Conference) లో అనేకదేశాలు కుటుంబనియంత్రణ కార్యక్రమంలో గర్భపాతాన్ని ప్రోత్సహించటాన్ని వ్యతిరేకించారు. పాకిస్తాన్ ప్రధాన మంత్రి శ్రీమతి బేనజీర్ బుట్టో, "తల్లి ప్రాణానికి పెద్ద అపాయం ఉంటేతప్ప ఇస్లాం గర్భపాతాన్ననుమతించదని" చెప్పారు.

హిందుస్థాన్ టైమ్స్ తా. 6-9-1994లో వచ్చిన వార్త ప్రకారం "పోప్" మహనీయుడుకూడ గర్భపాతాన్ని "Brutal formulas for population reduction" జనసంఖ్య తగ్గించటానికి ఉపయోగించే ఒక పాశవిక క్రూరమైన (మందు) చీటీ అని పేరుపెట్టాడు. ఆయనకూడ గర్భపాతాన్ని నిందించాడు.

హిందుస్థాన్ టైమ్స్ తా. 2-9-1994లో వచ్చిన సమాచారం - మదర్ థెరిస్సా మీ దగ్గర ఏదైనా అవాంఛిత సంతానం (మీకిష్టం లేనిది) మీరు పోషించి చదివించలేనిదుంటే నాకిచ్చేయండని అన్నది. ఆమె ఏ బిడ్డనీ స్వీకరించటానికి కాదనదు. ఆమె ఆ బిడ్డని ఇంటిలో ఉంచుకొని, ప్రేమించే తల్లిదండ్రులకిచ్చి పోషింపజేస్తుంది.

## భ్రూణహత్య - చట్టం దృష్టిలో

ప్రతి గర్భపాతంలోను జీవహత్య అనివార్యమవుతుంది. అందువల్ల 1971వ సంవత్సరము వరకు భారతదేశంలో గర్భపాతం చేయటం చేయించటం చట్టరీత్యా నేరంగా పరిగణింపబడుతూ వచ్చింది. ఇండియన్ పీనల్‌కోడ్ 312వ అధికరణం ప్రకారం గర్భపాతం చేసేవాళ్లకు, చేయించేవాళ్లకు గర్భపాతం చేయించుకోమని ప్రోత్సహించే వాళ్లకుకూడ మూడుసంవత్సరాలనుంచి "యావజ్జీవం" వరకు కఠిన కారాగార శిక్ష విధించబడుతూ ఉండేది.

1971వ సంవత్సరములో భారత ప్రభుత్వం ఒక క్రొత్తచట్టం (The

Medical Termination of Pregnancy Act. 1971) ది మెడికల్ టెర్మినేషన్ ఆఫ్ ప్రెగ్నెన్సీ ఆక్ట్, 1971 తెచ్చి గర్భపాతం చేయటానికి చేయించటానికి కూడ ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని ఒకరకమైన చట్టపరమైన మాన్యతను ప్రసాదించింది. ఈ 1971వ సంవత్సరపు క్రొత్తచట్టం ప్రకారం ఒక రిజిష్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్ అభిప్రాయంలో;

(a) గర్భం ఉండటం గర్భవతి ప్రాణానికి అపాయం కలిగిస్తూ ఉండటం గాని, ఆమె శారీరక, మానసిక స్వస్థతకి (Grave injury) తీవ్ర అఘాతం (భంగం) కలిగించేదయితేనూ;

(b) గర్భస్థశిశువు పుట్టిన తరువాత అతడు (ఆమె) వికలాంగుడుగాని మరోరీతిగా శారీరిక మానసిక రూపంలో అసామాన్యుడయ్యే తీవ్రమైన అపాయం ఉందంటేనూ;

పన్నెండు వారాల అవధి (వయస్సు) గల గర్భస్థ భ్రూణంయొక్క ఎబోర్షన్ చేస్తేనూ మరొక రిజిష్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్‌ని కూడ కన్సల్టు చేసినమీదట పన్నెండు వారాల నుండి ఇరవై వారాల వయస్సుగల గర్భస్థశిశువు (భ్రూణం) యొక్క ఎబోర్షన్ (గర్భపాతం) జరిపినందుకు అతడు (ఆమె) ఏ విధమైన దోషిగాను పరిగణింపబడటం జరగదు.

ఈ చట్టంలో మానసిక స్వాస్థ్యానికి కలిగే తీవ్రహాని (grave injury) ఇలా స్పష్టంచేయబడింది (Explanation).

1. గర్భవతియైన స్త్రీగర్భం బలాత్కారానికి గురైనందుకయితే అది ఆమె మానసిక స్వస్థతకు తీవ్రహానికరమైనదిగా పరిగణింపబడుతుంది.

2. ఆ మహిళ, ఆమె భర్తద్వారా కుటుంబనియంత్రణకోసం (సంతానం పరిమితం చేసుకోవాలనే ఉద్దేశ్యంతో) ఉపయోగింపబడ్డ గర్భనిరోధకసాధనం ఫలించకపోయిన దాని పరిణామస్వరూపంగా అవాంఛితమైన గర్భం ఉండిపోతే అదికూడ ఆ గర్భవతియొక్క

మానసికస్వస్థతకు తీవ్రభంగం కలిగించేదిగా పరిగణింపబడుతుంది.

ఈ రెండవస్పష్టీకరణ – (గర్భనిరోధకసాధనం అసఫలమైనందువల్ల గర్భం నిలబడిపోవటం) ఒక విధముగా భ్రూణహత్య చేయటానికి, చేయించటానికీ బహిరంగంగా అనుమతిని చట్టపరమైన పూర్తి మాన్యతనే ఇచ్చింది. ఇంకా చట్టంను రూపొందించిన వాళ్ల ఉద్దేశ్యాన్ని చట్టంయొక్క ఆ అభిప్రాయాన్ని పైపేరా (a), (b), (1) లో ఇవ్వబడ్డ దానికి తీవ్రక్షతి కలిగించింది. దీని ఫలితంగా భ్రూణహత్యలు పగలు అతివేగంగా పెరిగిపోసాగాయి. గర్భపాతం ఒక మంచి ముఖ్యమైన ఉద్యమంగానే తయారైంది. గర్భపాతం చేయించుకోటానికి లేదా అవాంఛిత సంతానంనుండి చవకగానే విముక్తి పొందటానికీ ప్రకటనలు కూడ దేశపు మూల మూలలా (విరివిగా) కనపడుతున్నాయి.

స్వయంగా ప్రభుత్వపు లెక్కలప్రకారం (Reference Annual India) 1976లో 2,06,710 గర్భపాతాలయినచోట 1981లో 18,21,004 గర్భపాతాలయ్యాయి.

25 మార్చి, 1993 నాటి హిందుస్తాన్ టైమ్స్‌లో వచ్చిన సమాచారాన్ననుసరించి ఆరోగ్యకుటుంబసంక్షేమ మంత్రి శ్రీ బి. శంకరానంద్ రాజ్యసభలో గత మూడు సంవత్సరాలలో అధీకృతసంస్థలలో (స్వీకృతి=లైసెన్స్ పొందిన) దాదాపు 18,10,100 గర్భపాతాలు జరిగాయి.

* అనధీకృత సంస్థలు, సొంతక్లీనిక్కులలో వీటికంటె ఎన్నిరెట్లు ఎక్కువ గర్భపాతాలయి ఉంటాయో మీరే అంచనావేసుకోండి. డా ॥ డి.పి. జైన్ శాకాహారక్రాంతిలో గర్భపాతపు విభీషకల (భయం కలిగించేవి) మీద వెలుతురు ప్రసరింపజేస్తూ (దృష్టిసారిస్తూ) సమస్త భారతదేశంలోనూ దాదాపు ఏబది ఒక్కలక్షల నలుబది ఏడువేల గర్భపాతాలు ప్రతీయేటా జరుగుతున్నాయనీ ఈ సంఖ్య ప్రతి సంవత్సరం పెరుగుతోందని వ్రాశాడు.

* బచావో! బచావో!, రచయిత ముని రశ్మిరత్న విజయ్.

ఈ విధముగా లక్షలకొలదీ నిర్దోషులైన అమాయక పసి కందులను గర్భాశయంలోనే నరికినరికి హత్యచేయటం ఒక నీచాపరాధం. ప్రపంచంలోని అనేక దేశాలలోనైతే హత్యలకు కూడ ఉరిశిక్ష విధింపబడటంలేదు. ఎందుచేతనంటే ఒకరి ప్రాణము తీసే అధికారము ఇంకొకరికి లేదు. గర్భపాతం ద్వారా హత్య అయితే ఉరికంటె కూడ ఎక్కువ క్రూరమైనది. ఉరివల్ల తత్కాల (వెంటనే) మృత్యువు జరుగుతుంది. మరి గర్భపాతంలో బిడ్డ చాలసేపు గిలగిలకొట్టుకొని మరణిస్తుంది. ఉరిశిక్ష ఏదో భయంకరాపరాధం చేసినవాడికే విధింపబడుతుంది. గర్భపాతానికి బలైన శిశువు బొత్తిగా నిర్దోషి ఈ నిర్దోషులైన పసిగుడ్డులకు ఏ న్యాయాలయంలోనైనా (కోర్టు) హాజరవటానికిగాని తమవైపునుంచి కోర్టులో వకాల్తా ఇప్పించి కేసునడిపించేందు కధికారం గాని ఉండియుంటే ఈ గర్భపాతానికి బలి అయిన బిడ్డల హంతకులైన తల్లిదండ్రులను, గర్భపాతాలు చేసిన డాక్టర్లను ప్రపంచంలోని ఏ శక్తీ ఈ ఉరి ఉచ్చుల్లోంచి తప్పించలేదు.

ఇష్టంలేని భార్యను తగులబెట్టి చంపెయ్యటం అపరాధమైనప్పుడు గ్రుడ్డివారు, వికలాంగులు, కేన్సర్, ఎయిడ్స్ (వంటి) మొదలైన వ్యాధులతో బాధపడేవారు - వృద్ధాప్యంతో దుఃఖపడుతూ శారీరక మానసిక కష్టంవల్ల తామే తమ మృత్యువుకోరుకొనేవారు అయిన వారిని చంపటం అపరాధమయితే మరి ఒక నిరపరాధి పూర్ణాయుర్దాయ కాలం జీవించే శక్తి గలదీ అయిన బిడ్డను గర్భంలో చంపిపారెయ్యటం అపరాధం ఎందుకు కాదు?

అహింసా సందేశమిచ్చిన గౌతమబుద్ధుడు, భగవాన్ మహావీరుడు అహింసార్చకుడైన మహాత్మాగాంధీలకు అనుయాయులు అహింసావాదులమని గొప్పచెప్పుకొనేవారు అయిన వ్యక్తులకు ఈ విధముగా నిరపరాధశిశువుల్ని గర్భంలోనే హత్యచేయటం, చేయించటం శోభనిస్తుందా? అది వారు సిగ్గుపడి చచ్చే విషయంకాదా?

ప్రపంచంలోని అనేకదేశాల ప్రభుత్వాలు ఈ నీచమైన

అపరాధవిషయంలో మేలుకొన్నాయి. తల్లిప్రాణానికి తీవ్ర అపాయం లేనంతవరకు, ఆమెను రక్షించే మరే ఉపాయమూ ఇక (మిగలనప్పుడు) లేనంతవరకు ఎబోర్షన్ అపరాధంగానే పరిగణింపజేసేలాగ చట్టం (తయారు) చేసే ప్రయత్నం కూడ చేస్తున్నాయి. ఇటువంటి చట్టం ప్రతిదేశంలోనూ శీఘ్రాతిశీఘ్రంగా (చాల తొందరలో) వచ్చేలా చేతనైనంత ప్రయత్నం చేయటం ప్రతీ మానవుడి కర్తవ్యము.

## గర్భస్థశిశువు యొక్క లింగపరీక్ష వరం కంటె శాపంగా తయారైంది

గర్భపరీక్ష (Prenatal testing) లేదా ఎమినోసింటసిస్, ఆనువంశిక వికృతులు వంశానుగతరోగాలు గుణసూత్రాలలో దోషాలు అనే వాటి జాడ తెలుసుకొనే ఉద్దేశ్యంతో ఆరంభింపబడింది. ఇది ఒక వైజ్ఞానికమైన ఉపలబ్ధి సైన్సుద్వారా లభించిన ఒక మంచి విషయం. ఎందుచేతనంటే ఈ పరీక్షలవల్ల 72 అసాధ్యమైన వంశపరంపరాప్రాప్తమైన రోగాలపుష్టి (వ్యక్తీకరణ) చేయబడుతుంది. గర్భస్థశిశువుకి ఏ రోగంగాని, దోషంగాని ఉంటే దానికి అప్పటినుంచే ఉపచారం (చికిత్స) ప్రారంభించడం సంభవమవుతుంది. నిజంగా ఇది ఒక వరదానం ప్రశంసించదగిన ప్రయత్నం. కాని ఈ పరీక్షవల్ల శిశువుయొక్క లింగం (ఆడా? మగా? అనేది) కూడ తెలుసుకొనే వీలున్నందువల్ల (అవకాశం ఉండటంచేత) తొందరలోనే (తక్కువవ్యవధిలోనే) ఈ వరదానం అభిశాపంగా మారిపోయింది.

మొదట్లో అయితే గర్భస్థశిశువును గురించిన పూర్తి పరిజ్ఞానం (తెలుసుకోవటం) పొందాలనే కుతూహలాన్నాపుకోలేకపోవటంవల్ల ఈ పరీక్ష చేయించుకోవటం జరుగుతూ వచ్చింది. కాని తొందరలోనే ఆ కుతూహల మమకారాలస్థానాన్ని ఆడపిల్లని మగపిల్లవాడికంటె హీనంగా చూచు దుర్భావనను కల్గించింది. పైగా "కడుపులో పిల్లవాడికి బదులు ఆడపిల్లలేదుకదా" అనే కుటిల స్వార్థపూరిత ద్వేషపూర్ణ భావంతో ఈ పరీక్షలు కొనసాగింపబడసాగాయి. ఆడపిల్లని మగపిల్లవాడికంటె తక్కువ

తరగతిదానిగాను లేదా ఒక విధమైన భారంగానూ భావించే ఈ సమాజపు మనోభావంవల్ల కొన్ని స్వార్థతత్త్వాలకు తమ ఉద్యమాన్ని తళతళలాడించే మంచి అవకాశం లభించింది. చూస్తూచూస్తూ ఉండగానే తఱచు అన్నిపట్టణాలలోను గర్భపరీక్షలు గర్భపాతాలద్వారా భ్రూణాన్ని (గర్భస్థశిశువుని) నష్టపరచేవీలున్న క్లీనిక్‌ల వరద వచ్చిపడింది. కొందరు లోభులైతే గర్భస్థమైన ఆడుశిశువుయొక్క హత్యని ప్రోత్సహించే "కట్నానికి చవకైన ప్రత్యామ్నాయం – గర్భపాతం" అనేనినాదాలు కూడ వ్యాపింపచెయ్యటానికి సంకోచించలేదు.*

ఫలితంగా లింగపరీక్ష తరువాత జరిగే గర్భపాతాల్లో 97% అంటే దాదాపు అన్నిటిలోనూ గర్భస్థమైన ఆడపిల్ల హత్యయే జరిగింది. గర్భస్థమైన మగబిడ్డని చంపించటంనుంచి దాదాపు అందరు తల్లిదండ్రులు తప్పించుకొంటున్నారు. అంతకుముందే వాళ్లకు కొందరు మగపిల్లలున్నాసరే నవభారత్ టైమ్స్, తా. 30-6-94లో వచ్చిన ఒకవ్యాసం ప్రకారం గడచిన ఐదేళ్ళలోను గర్భస్థస్త్రీ శిశువును అంతం చేసిన సంఖ్య దాదాపు 200% పెరిగింది. ఈ అమానుష ప్రవృత్తి స్త్రీపురుష జనసంఖ్యమధ్య చాల వ్యత్యాసాన్ని (అసమానత) కలిగించింది. 1981లో ప్రతి వెయ్యిమంది పురుషులకీ ఆడువారి సంఖ్య 935 ఉంటే 1991లో ఇది తరిగి 929 మాత్రంగానే ఉండిపోయింది. కొన్నిప్రదేశాల్లో

---

* ఆడపిల్లల పెళ్ళిళ్లకు వరకట్నం ఇచ్చుకోవలసివస్తుంది కాబట్టి వరకట్నం నుండి తప్పించుకోవాలంటే గర్భంలో ఆడపిల్ల ఉన్నట్లు తెలిస్తే గర్భపాతం ఒకటే ప్రత్యామ్నాయ మార్గం అని అర్థం. పుత్రుడుగాని పుత్రికగాని తమతమ అదృష్టములతోనే జన్మిస్తారని నిశ్చితముగా సత్యము. కావున పుత్రునికన్న పుత్రికను హీనభావంగా చూడటం సర్వథా అనుచితమేగాక అబద్ధపు నమ్మకాలు ఆధారంగా ఏర్పడిన భ్రమ. గర్భంలోనే హత్య చేయటం దుష్కర్మయేకాక పాపముకూడ. దీనివలన లభించే దండననుండి హత్యచేసేవారు, చేయించేవారు ఇరువురును తప్పించుకోజాలరు మరియు ఈ దుష్కర్మ ఫలితాలను జన్మ జన్మాంతరాలవరకు గూడ అనుభవింపవలసి వస్తుంది.

అయితే ఈ సగటు (యొక్క) దిగిపోయిన స్థితి 882 మాత్రమే.

26–7–94 నాటి హిందూస్తాన్ టైమ్స్‌లో వచ్చిన సమాచారం ప్రకారం దేశంలో తగ్గుతూ ఉన్న పురుషస్త్రీ అనుపాతంవల్ల (జనసంఖ్యలో వ్యత్యాసం) ఇప్పుడు ప్రతి వెయ్యిమంది పురుషులకీ స్త్రీల సంఖ్య 910 మాత్రంగానే ఉండిపోయింది. పురుష – స్త్రీ అనుపాతంయొక్క ఈ తగ్గుతున్న ప్రవృత్తిని (ధోరణిని) ఆపకపోతే అసమానమైన 'లింగానుపాతం' వల్ల బహుభర్తృత్వ ఆచారం, వేశ్యావృత్తి మొదలైన అనేకవిధాల సమస్యలు పెరిగిపోవటం సంభవిస్తుంది. దీని ఫలితంగా ఎయిడ్స్ వంటి మహామారి తీవ్రంగా వ్యాపిస్తుంది.

ఈ పరీక్షలందు పెరుగుతున్న దుర్వినియోగాన్ని అడ్డుకోవటానికి అందరికంటె ముందు మహారాష్ట్రప్రభుత్వం భ్రూణంయొక్క లింగపరీక్షని 'Ban' (నిషేధము) చేసింది. ఆ తరువాత కొన్ని ఇతరరాష్ట్రాలు ఇప్పుడు కేంద్రప్రభుత్వముకూడ ఒక "Pre–natal Diagnostic Techniques" (Regulation and Prevention of Misuse) Bill" పాసుచేసి భ్రూణలింగపరీక్షలమీద ఆంక్షలు విధించింది. కాని కేవలం చట్టం చేసినంతమాత్రాన ఏ చెడుగూ పూర్తిగా నశించదు. ఎందుచేతనంటే స్వార్థపరులు చట్టంనుంచి తప్పించుకోవటానికేదో ఒక దారితీస్తూనే ఉంటారు. కనుక ఈ చెడుగును ఆపటానికి మహిళాసంస్థలు, ప్రభుత్వం, మేధావులైన పెద్దలు కలిసి ఒక దేశవ్యాప్తమైన ఆందోళన నడపాలి. ప్రజల్ని ప్రత్యేకించి తల్లుల్ని మేలుకొలపాలి. వారిని ఆ వికృత మూఢవిశ్వాసాలనుంచి ఆచారాలనుంచి విముక్తులను చెయ్యాలి. వారు భ్రూణహత్యకి బాధ్యులు కదా!

ఈ పరీక్షద్వారా ఆడో మగో (బిడ్డ) తెలుసుకోవటం నూటికి నూరుపాళ్లు జరుగుతుందనటం కూడ ఉచితం కాదు. పైగా ఈ పరీక్షలవల్ల కొన్ని అపాయాలు సంభవించగలవనీ చెపుతున్నారు. ఉదా:– భ్రూణం బీజాండాసనం (ప్లేసెంటా) నష్టమవటం. దానంతట అదే గర్భపాతంగాని, సమయానికి ముందే (నెలలునిండకుండా) ప్రసవించటంగాని జరిగే

అవకాశం ఉండటం. బొంబాయిలోని శ్రీమతి నాథీబాయి దామోదర్ ఠాకర్ సీఫార్మసీ కాలేజి డాక్టర్ ఆర్. పీ. రవీంద్ర చెప్పిన దాని ప్రకారం ఈ పరీక్షవల్ల నితంబము తొలగటం, శ్వాసరోగం సంభవించవచ్చు. ఢిల్లీ మిడ్ డే, తా. 17-12-93లో వచ్చిన సమాచారం ప్రకారం మాటిమాటికి అల్ట్రా సౌండ్ చేయించుటవలన శిశువు బరువుమీద (దాని) దుష్ప్రభావం పడుతుంది. Dr. Arti Malik మాటల్లో -"No longer it is believed that pre-natal ultrasound is entirely harmless." గర్భస్థశిశు లింగపరీక్షలు పూర్తిగా నిరపాయమని ఎప్పుడూ చెప్పలేము.

ఆకాశంకంటె ఉన్నతుడని చెప్పబడే తండ్రీ, సంతానం యెడల అగాధ మమత, నిస్స్వార్థత్యాగ భావన కారణంగా దేవీ - దేవతలకంటె కూడ ఉన్నతస్థానంలో ఉంచబడిన తల్లీ, వీరిద్దరూ తమ పితృత్వమాతృత్వాల గౌరవాన్ని నిలబెట్టుకోవటానికి ఆడసంతానపు హత్యను పెంపొందించే భ్రూణలింగపరీక్ష తాము స్వయంగా చేయించుకోకపోవటానికీ, యితరుల్ని చేయించుకోవద్దని సలహా ఇవ్వటానికీ దృఢసంకల్పం చేసుకోవాలి. ప్రతి దంపతులూ ఇలా నిశ్చయించుకొంటే ప్రపంచంలోని యేశక్తి వారి గర్భస్థ బాలికా సంతానాన్ని హత్యచేయలేదు.

## మగ ఆడ పిల్లలలో భేదభావమెందుకు?

ఇంతకుముందు చెప్పినట్లు భ్రూణ లింగపరీక్ష చేయించిన తరువాత చేయించే (గర్భపాత) భ్రూణహత్యలలో ప్రాయికంగా అందరూ ఆడపిల్లలే అవుతున్నారు కాని మగపిల్లలుకారు. ఎందుచేత? ఆ బిడ్డ హత్య హింసాశ్రేణిలోకిరాని ఏదైనా ప్రాణంలేని వస్తువా ఆడపిల్ల? ఆ బిడ్డను చంపటానికి చట్టం అంగీకరించటానికి? ఆడపిల్లైపుట్టటం ఏమైనా అపరాధమా? ఆడపిల్లలేదైనా అవసరంలేని వస్తువులా? మగపిల్లలలో కంటె ఆడపిల్లలలో మానవీయ గుణాలు, ప్రతిభ, కార్యదక్షత తక్కువ వుంటాయా?

కాదు. అక్షరాలా కాదు. తల్లిదండ్రుల అంశలు బాలుడిలో ఉన్నంతే బాలికలోనూ ఉంటాయి. ఆడ భ్రూణంలోకూడ మగభ్రూణంలో ఉన్నంత ప్రాణమే ఉంటుంది. నిరపరాధబాలురినీ పురుషుల్ని చంపిన వారికి విధింపబడే శిక్షే (దండన) నిరపరాధబాలికల్ని, స్త్రీలనీ చంపిన వారికీ విధింపబడుతుంది. స్త్రీ అయితే సృష్టికి జనని, పురుషుని ప్రేరణశక్తి. నారి (స్త్రీ) తనని పురుషులతో సమానమైన స్థానంలో ఉంచుకోవటమే కాక వారికంటె శ్రేష్ఠురాలుగా కూడ నిరూపించుకున్నదనటానికి చరిత్ర సాక్ష్యమిస్తోంది. రాక్షస సంహారంచేసిన మాత దుర్గ, త్యాగతపస్సులకు మూర్తి సీతాదేవి, యమధర్మరాజునికూడ ఓడించగలిగిన సాధ్వి సావిత్రి. వీరందరు స్త్రీలే. ఝాన్సీరాణి లక్ష్మీబాయి, మదర్ థెరిస్సా, M.S. సుబ్బలక్ష్మి, లతా మంగేష్కర్ మొదలైన స్త్రీలుకూడ తాము సాహసం, కార్యదక్షత, ప్రతిభ, మొదలైన ఏ క్షేత్రంలోనూ పురుషులకంటె తీసిపోమని నిరూపించుకొన్నారు. తమ వంశంయొక్క, తల్లిదండ్రులయొక్క పేరుప్రతిష్ఠల్ని స్త్రీలు ప్రకాశింపజేసినంతగా ఎంతమంది పురుషులు చేయగలుగుతున్నారు? మహాకవి కాళిదాసు, సంత్ తులసీదాసు మొదలైన వారిని సాహిత్యకారులవటానికి ప్రేరేపించింది స్త్రీలే. "There is a woman behind every successful man". (ప్రతీ సఫలుడైన పురుషునివెనుక ఒక స్త్రీయే ఉంటుంది) అనే ఇంగ్లీషు సామెతను ప్రపంచమంతా ఒప్పుకుంటోంది.

మనుస్మృతిలో కూడ చెప్పబడింది

యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః ।
యత్రైతాస్తు న పూజ్యన్తే సర్వాస్తత్రాఫలాః క్రియాః ॥

(మనుస్మృతి 3/56)

స్త్రీలకు ఆదరం ఉన్నచోట దేవతలందరూ నివసిస్తారు (ఆనందంతో) వీరిని పూజించనిచోట అన్నికార్యాలూ నిష్ఫలమైపోతాయి.

ఆడపిల్లల, మగపిల్లలలో భేదభావం పెట్టుకోవటం ఏ నిజమైన లేదా ఉచితమైన తర్కం (వాదం) మీద ఆధారపడిందికాదు. అది కేవలం మనలో ఉన్న స్వార్థంవల్ల, మూఢవిశ్వాసాలవల్ల ఏర్పడిన (ఆచారాలు)

అసత్యపు భ్రమ మీద మాత్రమే ఆధారపడింది. ఇది మనలో ఉన్న దైవీగుణాల్నికాక ఆసురగుణాల్ని పరిచయం చేస్తుంది (తెలియపరుస్తుంది). పిల్లవాడు వంశప్రతిష్ఠ ప్రకాశింప జేస్తాడు. వార్ధక్యంలో ఆసరా అవుతాడు. ఆడపిల్ల పరాయిసొత్తు. ఆ పిల్లపెళ్లికి కట్నం ఇవ్వవలసి ఉంటుంది. అంటే సంపాదించిన ఆదాయంలో తరుగు (లోటు) వచ్చిపడుతుంది. పిల్లవాడి పెళ్లికయితే శ్రమలేకుండా సంపాదించకుండానే ధనం లభిస్తుంది. ఇటువంటి ఆలోచనలలో శుద్ధస్వార్థం లోభగుణాలు మాత్రమే దాగి ఉన్నాయి. వాత్సల్యం, మమకారం సంతానంపట్ల ప్రేమభావన అనేవి బొత్తిగా వెనకబడిపోయాయి ఇటువంటి స్వార్థపర ప్రయత్నపూర్వక మనస్తత్త్వం నుంచి పుట్టి ఇటువంటి స్వార్థమనస్తత్త్వంలో పెరిగిన సంతానం స్వార్థమనస్తత్త్వంకలదిగానే తయారవుతుంది. ఆ సంతతికూడ పెద్దదై తనముసలి తల్లిదండ్రులను తన స్వార్థదృష్టితోనే చూచినా అందులో ఆశ్చర్యమేముంది? ఎటువంటి విత్తనం నాటితే అటువంటి పంటే వస్తుంది. "వేపగింజ నాటితే మామిడి పండు ఎక్కడినుంచి వస్తుంది" పుత్రులు, పుత్రికలు అందరు తమతమ అదృష్టం వెంటతెచ్చుకొని వస్తారనేది ఒకనిశ్చితమైన సత్యం. మనం నాలుగువైపులకీ దృష్టిసారిస్తే ఇటువంటి అనేక ఉదాహరణలు కనిపిస్తాయి. ఎటువంటివంటే ఒక పేదవాడి బిడ్డ (కూతురు) రాజభోగమనుభవిస్తోంది. ఆ పిల్ల పెళ్లయిన తరువాత తల్లిదండ్రుల, సోదరులయొక్క పేదరికాన్ని కూడ పోగొట్టింది. అలాగే ధనికుడి కొడుకు ఐశ్వర్యం పోగొట్టుకొని దుఃఖమనుభవిస్తున్నాడు.

మనం మనకి పరిచయమున్న ఇతర కుటుంబాలమీద దృష్టిసారిస్తే ఎక్కువమంది తమ కూతురు అల్లుడు వల్ల సంతుష్టిపొందే తల్లిదండ్రులు కనిపిస్తారు. అలా అంతమంది కొడుకు కోడళ్లవల్ల సంతృప్తి పొందుతున్నవాళ్లు కనిపించరు. ఆడపిల్ల పెళ్లి తరువాత అల్లుడు రూపంలో ఒక పుత్రుడు లభిస్తున్నాడు కాని ఆడపిల్ల పెళ్లి అయిన తరువాత నయితే కొడుకుకూడ కేవలం కోడలివాడై పరాయివాడవుతున్నాడు. అనేక కుటుంబాలలో కొడుకులు తల్లిదండ్రులతోపాటు కలిసి ఉండటానికి ఇష్టపడటంలేదు. ఒకవేళ కలిసి ఉంటే ఎవరైనా; అక్కడ కలహాలే ఉంటున్నాయి. ముసలి తల్లిదండ్రులకి దుఃఖసమయంలో కూతురు అల్లుడు

చూపించేటంత ఆత్మీయత, వాళ్లని కనిపెట్టడం కొడుకూ కోడలు చూపటంలేదు. ఎవరైనా చూపించే వాళ్లున్నా వాళ్లు ఆత్మీయతతో కాక చెడ్డపేరురాకుండా తప్పించుకుందామనే భావంతోనూ ప్రపంచానికి పైకి చూపించటానికే చూపించటం లేదా సమాజంవల్ల మాటపడతామేమో అనే భయంతోనే. కాబట్టి ముసలితనంలో కూతురుకంటె కొడుకు ఎక్కువ ఆసరా అవుతాడనుకోవటం ఎండమావి మాత్రమే. కొడుకేకనక ముసలితనంలో ఆసరా అవుతూ ఉంటే నిత్యమూ క్రొత్తక్రొత్తవృద్ధాశ్రమాలు తెరవవలసిన అవసరం రాదు. తీర్థస్థలాల్లో (పుణ్యక్షేత్రాలు) రెండుపూటలా రొట్టెముక్కలకోసం ఇటూ అటూ ఏ దిక్కులేక తిరిగే ముసలమ్మలగుంపు కనిపించదు.

రెండుమూడు తరాలు నడిచే వంశము పేరుయొక్క ప్రశ్న వచ్చినపుడు పుత్రుడుకనక వంశంయొక్క పేరుప్రతిష్ఠలు నిలబెట్టగలిగితే దానిని కళంకితం కూడ చేయగలడు. ఎవడి పేరుప్రతిష్ఠలైనా స్వయంగా తన పనుల వల్ల సద్గుణాలవల్లనే వస్తాయి. కొడుకులు కూతుళ్లవల్లకాదు. ముఖ్యమైనది సద్గుణాలు. అవి ఏ పుత్రికలో, ఏ పుత్రుడిలో ఉంటాయో వారే కీర్తిప్రతిష్ఠలు తెస్తారు. ఆడపిల్లలు ప్రస్తుతం అన్ని క్షేత్రాల్లోనూ మగపిల్లలకంటె ముందుంటున్నారు. పరీక్షా ప్రమాణాల్లో కూడ ఆడపిల్లల సఫలతయొక్క అనుపాతం మగపిల్లలకంటె అధికంగానే ఉంటోంది.

కాబట్టి మగపిల్లవాడికంటె ఆడపిల్ల హీనం అనుకోవటం అన్నివిధాలా అనుచితం. అసత్యపు విశ్వాసాలమీద ఆధారపడిన భ్రమమాత్రమే. ఆడపిల్లను గర్భంలోనే హత్యచేయుట ఒక దుష్కర్మ, పాపము. దానికి విధింపబడే శిక్షనుండి హత్య చేసినవాళ్లు, చేయించినవాళ్లు ఇద్దరూ తప్పించుకోలేరు. వారు వారి జన్మజన్మాంతరాలవరకు యిట్టి దుష్కర్మలఫలం అనుభవించే తీరాలి.

~~~~oOo~~~~
~~~~